శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీ రామనామ మహాత్మ్యము.

ఈగ్రంథము.

చిత్తూరుజిల్లాలోచేరిన రాయవేలూరు గ్రామునివాసులగు

సబ్ డివిజను ఆఫీసునందు.

హెడ్ క్లర్కు గారయిన.

పి. విజయరాఘవులు నాయునింవారివలనయున్న

పైవ్రాయబడిన ఆఫీసునందు మేస్త్రీగారయిన

టి. రంగుసింగుగారు చేతనున్న

ప్రతులసహాయముచే

పసుపులేటి పురుషోత్తం నాయుడుచేతను

కనిగెల్పుల రామయ్య శెట్టిగారుచేతను

ప్రకటింపబడియె.

బెజవాడ.

సి. యి. ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

**1914**

ద్వి॥ స్వామిమత్సకల్ప వికల్పంబులు మీయుభయకావే
రితీరంబు నాదేహంబు మీకురంగక్షేత్రంబు నాసత్వాభర
ణంబు మీకుసప్తప్రాకారంబు నారజోగుణంబు మీకుహే
మశృంగంబు నాగర్వంబు మీకు ధ్వజస్తంభంబు నావక్ష
స్థలంబు మీవనమాలిక నాకామక్రోధంబులు మీకుసువ
ర్ణకవాటంబు నావివేకంబు మీ విమానద్వారంబు నా
జ్ఞానవయిరాగ్యంబులు మీద్వారపాలకులగు జయవిజయు
లు నాపురుషాకారంబు మీకు యమృతతుల్యంబు నాసన్మో
హంబు మీనవరత్నఖచితకిరీటంబు నాకళంకజాలంబు మీక
స్తూరితిలకంబుసాహసనన్నాహంబులునాభక్తిసంపదమీపా
దాంగుళంబులపైయర్చించినకుసుమంబునాభద్రంబులు నె
యివేద్యంబులు నాశబ్దస్పర్శరూప రసగంధంబులు మీక
ర్పూర కస్తూరిపరిమళమిళితతాంబూలంబు నాఘ్రాణేంద్రియం
బులు మీ కర్పూరనీరాంజనధూపంబు నాకర్ణేంద్రియంబు
లు మీనృత్యగీతాదివాద్యంబులు నాజాగ్రత్స్వప్న సుషు
ప్తులు మీకుఛత్రచామరాలవట్టంబులు నాసంసారంబు మీ
కు ప్రదక్షిణంబులు నాతత్వమీపనివాసంబు సర్వాంగాలింగి
త నమస్కారంబు లిన్విధంబున గరుణించి కలుషదూరుని
గాఁజేసి రక్షింపవేయుభయకావేరి మధ్యస్థలనివాసా సర్వే
శ్వరా నమోనమో శ్రీరంగేశ్వరా॥



శ్రీ

రామజయోస్తు.

# శ్రీ రామ నామ మహాత్మ్యము.

వృషభగతి రగడ.

శ్రీమహాత్తత్త్వార్థబోధ విశేషమైనది రామనామము
సోమసూర్యాగ్నులనుమించిన స్వప్రకాశము రామనా॥ 1
మూడుగుణముల ప్రకృతివికృతికి మూలకందము॥ రామ
పంచతత్త్వంబులకునావల నెసఁగుచున్నది రామనామ॥ 2
నాల్గుసాధనములువహించిన నడతదెలుపును రామనామ
వెల్గులోపలవెలుగుదానై వెలుగుచున్నది రామనామ॥ 3
మూడుమూర్తులజన్మభూమికి మూలదైవము రామనా
ఏడువ్యసనములనుహరించెడి యిద్ధసూత్రము రామనా 4
సకలలోకంబులభరించెడి సత్యరూపము రామనామ
ప్రకటయోగీంద్రులకునైనను బరమగోప్యము రామ॥ 5
నాదబిందుకళామయంబగు వేదమంత్రము రామనామ
వాదభేదంబులనుదొలగిన వారిభోగము రామనామ 6
జ్ఞానదృష్టిఁజూడఁగలిగిన మానసీయము రామనా

లోపవెలుపలనిండియుండెడి జ్ఞానదీపము రామ 7
నిరుపమానము నిర్విశేషము నిష్కళంకము రామనా
పరమకళ్యాణప్రదంబగు ప్రణవనాదము రామనామము 8
మూపునిలిపిభజించువారికి సుఖముసొగును రామ
మూపుమనసులునొకటిజేసిన శుభకరంబగు రామనామ 9
పంచవింశతితత్వములకును మించియున్నది రామనా
పంచదశమంత్రాక్షరములకు ప్రాణకరణము రామ॥ 10
కోటికమేలజయజ్ఞఫలముల సాటిమైనది రామనా
మాటమరచినదూరదర్శికి మంత్రయోగము రామ॥ 11
రెండునొక్కటిజేయువారికి నిండియున్నది రామ
పండువెన్నలకాంతిగల్గిన బ్రహ్మనాళము రామనామ 12
అన్నిరూపంబులునుదానై యాడుచున్నది రామనా
అన్నిరూపంబులనుదనలో నణచుకొన్నది రామనా 13
పాపమనియెడిమేఘమునకును ప్రళయవాయువు రామ
పావనంబునుమెఱయుచుండెడి దీపరాజము రామ॥ 14
నిర్మయోగములెన్నిసలిపిన గానరానిది రామనా
కర్మలాత్మజ్ఞులకునెప్పుడు ధర్మమైనది రామనా॥ 15
సోహమనుమంత్రార్థవిధుల విదేహముక్తియు రామ
దేహవాసనవదలినసుఖమున దివ్యదృష్టియు రామ॥ 16

నిదురలోపలనిదుర దెలిసిన నిజముదెలుపును రామ
పదిలముగసాధించువారికి పరమపదమగు రామనా॥ 17
జన్మదుఃఖాబ్ధినిదరింపగ జలుపుచున్నది రామనా
చిన్మయాత్మలకెల్ల కాలము చిన్మయము శ్రీరామ॥ 18
అష్టదళములకమలమందున నమరియున్నది రామ॥
అష్టదేహాంతరములందున నంటకున్నది రామ॥ 19
ఏకమైనిరువధికనిరుపము లోకమైనది రామనా
శోకమోహవినాశకరమై చూచుచున్నది రామనా॥ 20
ఏడుప్రాకారములకావల నెసగుచున్నది రామ
ఏడుశక్తులగెలచినను దనతోడబల్కును రామ॥ 21
సర్వశబ్దంబులును దానై సాక్షియైనది రామ
నిర్వికారముశుద్ధతత్వము నిర్మలము శ్రీరామ॥ 22
మూడుకాలములందుబొలయని ముఖ్యబింబము రా॥
మూడునదులును దాటువారికి మోక్షలక్ష్మియు రా॥ 23
మేరుచక్రాంతరమునందున మెరయుచున్నది రా॥
గారణాచార్యునికతంబున గానవచ్చును రామ॥ 24
అమృతపానముచేయుసురులకు నచలమైనది రా॥
అమృతవర్షముగురియుచుండెడు నభ్రివా శ్రీరా॥ 25
తారణాయోగీంద్రులకును నిధానమైనది రా॥

ఘోరరోగవసంబులకును గుఠారమే శ్రీరామనా॥ 26
ఆదిశేషునినిదురలేపిన బోధచేయును రా॥
ఆదిమూలప్రకృతికతికి ననాదియైనది రామనా॥ 8
తత్వమనివాక్యార్ధమనియెడి తత్వమే శ్రీరామనా
సాత్త్వికాదిగుణంబులకు నిస్సంగమైనది రామ॥ ప 9
అజపగాయత్రినిరచించిన యాదిబీజము రా।
భజనపరులకునెల్లకాలం బ్రహ్మయజ్ఞము రామ॥ 29
దేశమునుగాలముబొందని దివ్యతేజము రా॥
అశలనుసర్పములనుద్రుంచు ఖగేశుడగు రామ॥ 30
తారకబ్రహ్మానుభవులను జేరియుంచును రా॥
దారితప్పక ముక్తికిఁగొలచిన దర్శనంబగు రామ॥ 31
ఎఱుకమఱుపులనెఱిగియుండెడు నెఱుకయే శ్రీరా॥
గరుడగమనాదులకునైన నగణ్యమైనది రామ॥ 32
ముక్తికాంతామణికి నెప్పుడు ముదమొసంగును రా॥
భక్తవరులకు క్షేమకరమై ప్రబలుచున్నది రామ॥ 33
కామరాగాదులకునంటని ధామమే శ్రీరా॥
సోమమాత్రబిలంబులోపల జ్యోతియే శ్రీరామ॥ 34
చిత్తశాంతినిగలుగజేసెడి చిత్స్వరూపము రా॥
సత్తుచిత్తులరెంటినెనసెడి స్వప్రకాశము రామ॥ 35

మహదహంకారాదిగణ సహితమైనది రా॥
షడ్గారగగనపథంబులోపల దర్శనము శ్రీరామ॥ 37
జినదయకమలజబిందుపులకు బెంపొదవ జేయును రా॥
చినముతో భ్రూయుగంబునడుమను బ్రమోయుచుండును॥
అష్టధనులగుమండలములను దాటియున్నది రా॥
అష్ట బుద్ధినిగలిగితలచిన గోర్కెదీర్చును రామ॥ 38
అలక్ష్యమైనపదియాకళలను నిలిచియున్నది రా॥
సత్యలోకమునందు సుప్రతిష్ఠానమైనది రామ॥ 39
జన్మమృత్యుజరాదిహీనమును జంపరశ్మియు రామ॥
తన్మయత్వమునొందువారికి దత్పరము శ్రీరామ॥ 40
రజతగిరిపతిసతికి నెప్పుడు రమ్యమైనది రామ॥
సృజనపాలనవిలయములదా జేయుచుండును రామ॥ 41
యోగమాయనుదాల్చినట్టి ప్రయోగమే శ్రీరామ
ఆగమాంతవిచారనిపుణులు కాదినామము రామ॥ 42
నాల్గుదళములకమలమందున వెల్గుచున్నది రామ
నాల్గునక్షరనాదములుగా నాటియున్నది రామ॥ 43
కరమునక్షరమునురచించిన గురునిరూపము రామ
కరణములమూటికినవశ్యం బెరుగుటకు శ్రీరామ॥ 44
పరమగోప్యము బ్రహ్మవాదము భేదిచరితము రామ

స్థిరముగను బిందువును నిల్పిన సిద్ధి యొసగును రామ॥ 45
ఆఱుదళములకమలమందున నమరియున్నది రామ
ఆఱునక్షరనాదములుగా నాడుచున్నది రామ॥ 46
గర్భనరకములన్ని బాపెడు గానమే శ్రీరామ
భూర్భువాదికలోకములకును భూషణము శ్రీరామ॥ 47
వేదచోదితమై వెలింగెడి విశ్వరూపము రామ
వేదవాక్యప్రమాణములచే బాడుకొన్నది రామ॥ 48
పరమగురురూపంబు దానై పరమవగుచున్నది రామ
రతిశయబోధస్వరూపము నిర్మలము శ్రీరామ॥ 49
పదిదళంబులకమలమందున గదలుచున్నది రామ
పదివిధములగునాదములుగా బలుకుచున్నది రామ॥ 50
సప్తకోటిసుమంత్రములకును గుప్తమైనది రామ
సప్తజిహ్వానిమండలములో జ్ఞప్తియే శ్రీరామ॥ 51
జ్యోతిరూపంబును వహించిన సుప్రకాశము రా॥
జాతినీతులు లేనిమానస జపవిధానము రామ॥ 52
జ్ఞానయోగము చేతజూచిన గానవచ్చును రా॥
మానసానందము నొసంగెడి మౌనమే శ్రీరామ॥ 53
అమరద్వాదశపత్రకమలము నంటియున్నది రా॥
సమరసముగా బదియు రెండక్షరములాయెను రామ॥ 54

## శ్రీరామనామ మహాత్మ్యము.

బిందుచలనము లేనివారల బొందియున్నది రా॥
బిందుమండలమధ్యగతమందు నిండురూపము రామ॥
ఘనసుషుమ్నానాడియందలి కాంతియే శ్రీరామ॥
అనిమిషత్వంనొందినను బ్రహ్మత్వమొసగును. రామ॥
మూడుదేహంబులనుసోకని మూలదేహము రామ॥
ఏడుప్రాకారములకావల నెసగుచున్నది రామ॥
బంధకంబులనెల్లద్రుంచెడి ప్రకటయోగం రామ
అంధులై యున్నట్టివారల కద్దమైనది రామ॥
పదియునూఱుదళంబులనుగల పద్మమే శ్రీరామ॥
పదియునాఱుస్వరాక్షరములుగ బలుకుచున్నది. రామ॥
దూరదృష్టియులేనివారికి దుర్లభము శ్రీరామ॥
నీరుపాలును నేర్పఱించెడి నీతిదెల్పును రామ॥
శేతముదురును దెలియువారికి దాతయగు శ్రీరామ
ధాతవ్రాసినవ్రాలుదుడిచెడి దైవమే శ్రీరామ॥
ఎందుజూచినగానియొక్కటై పొందియున్నది రామ
సందులేకయజాండరూపము నొందియున్నది రామ॥
ఆదిమధ్యాంతములులేక ననాదియైనది రామ
ఆదిశక్తికిప్రాణపంక్తియు నాదిజేయును రామ
శంభునేత్రము దెరచిచూచిన శత్రునాశము రామ

శాంభవినిధరించువారికి సాధనము శ్రీరామ
త్రిపుటిమధ్యమునందువెలిగెడి దీప్తియే శ్రీరామ
ఉపరిజిహ్వాకుముందుపలికెడి జపనిదానము రామ॥ 6
కపటయోగముచేతనెవరికి గానరానిది రామ
జపతపోవ్రతయజ్ఞములచే జెప్పరానిది రామ॥ 6(
రెండుదళములకమలమందున నిండియున్నది రామ
రెండునక్షరనాదములతో బండియున్నది రామ॥ 6
మొదటితంత్రిందెలియువారికి ముక్తిమార్గము రామ
పదిలముగబఠియించుమునులకు బ్రహ్మకర్మము రామ॥ 68
దుముఖములు గలుగుపక్షికి నక్షరము శ్రీరామ
చుభూతంబులనుమిగ్రింగెడు నాకసము శ్రీరామనా 69
మేనుమనమును దురభిమానము లేనిదే శ్రీరామనా।
మేనుసేననియున్నవారికి లేనిదగు శ్రీరామనా॥ 70
సర్వలోకాతీతమై శివసహితమైనది రామనా
నిర్వికల్పము నిర్జరామృత నిత్యభోగము॥ రామనామ॥ 71
షడ్దర్శనదృశ్యజాల విరహితమే శ్రీరామ
దృష్టికిని గోచరముగానిది దూరదేశము రామ॥ 72
మండలత్రయమార్గమందున మరిగియున్నది రామ॥
కుండలినిభేదించిచూచిన బండువెన్నెల రామ॥ 73

గాలిమనసుసుమూలజేసెడి ఘనునిశపమే రామ॥
సూర్యోదయమధ్యమందున నెగడియున్నది రామ॥ 74
అమలభావముజేతగొలిచిన నమృతమొసగును రామ
అమృతనాదములాలకించిన నమితసౌఖ్యము రామ॥ 75
ధరణికిని యాకాసవీధికి దగిలియున్నది రామనా
మరణమూర్ఛలబాపుచుండెడి మంత్రయోగము రామ 76
పరమతారకరాజయోగ భ్రాజమానము రామ
చిరతరంబగుపూర్ణదృష్టికి సిద్ధిమొసగును రామనా॥ 77
ప్రకృతవికృతులరెంటికిని సద్బ్రహ్మమే శ్రీరామ
సుకృపదుష్కృతయోగములలో పోకకున్నది రామ॥ 78
అచలమైయానందమై పరమాణువైనది రామనామ
అచలమానసమునభజించిన సకలశుభములు రామ॥ 79
శివవిరించిహరీంద్రసుమన స్సిద్ధియే శ్రీరామ
భవముదోషముకులము రేయుంబగలులేనిది రామ॥ 80
తెలివిలోపలదెలివిదానై తెలియుచున్నది రామ
వెలుగుచీకటిరెండులేకయు వెలుగుచున్నది రామ॥ 81
సాంఖ్యయోగంబుబూనుటకు బల్సాధనంబు శ్రీరామ॥
సంఖ్యలేనిచరాచరంబుల నాగచేయును రామ॥
ఆత్మతపమునుజల్పువారికి నాత్మయజ్ఞము రామ

ఆత్మజీవాత్మలునుదానై యాడుచున్నది శ్రీరామ॥ 83
మూడవస్థలనెందునంటని మోక్షపదవియె రామనా
మూడుమూర్తులబీజములుగా మ్రోగుచున్నది రా॥ 84
ఘనతరోంకారంబునందున గానవచ్చును రామ
అనిమిషులుపానంబుచేసెడి యమృతబిందువు రామ॥ 85
నారదాదిమునీంద్రులకు నంసారమైనది రామ
మారుతాత్మజుమనసులోపల మరిగియున్నది రామ॥ 86
జన్మమరణంబులనుబొందని చదువునేర్పును రామ
చిన్మయుంబైనసృష్టికిని సువిశేషమైనది రామనా॥ 87
నరకమనుచీకటికిసదమల తరణిబింబబు రామ
పరమగుహ్యమె ధీప్రకాశము బ్రహ్మనాదము రామ॥ 88
విష్ణులోకము శైవలోకము విశ్వమయమగు రామ
విష్ణుమాయనుగెల్చువారికి విశదమగు శ్రీరామ॥ 89
నిర్గుణంబగుచిత్సమాధికి నిశ్చలము శ్రీరామ
సద్గుణంబులమించివైచెడి తుల్యరూపము రామ॥ 90
సత్యముక్తికి నిత్యభుక్తికి సత్యవచనము రామ
సత్యవాక్యధురీణులకు సంస్వర్గమే శ్రీరామ॥ 91
సోహమనుమంత్రార్థవిధులకు సోమసారము రామ॥
మోహమును లోభమును బెనగని యూహయే శ్రీరా॥ 92

గురునినాదద్వయములౌనై మెరయుచున్నది రామ
పరమపదముకుమార్గమిచ్చెడి చరమరూపము రామ॥ 93
వేయుదళముల కమలమందున వెల్గుచున్నది రామ
మాయమాటలుపలుకువారికి మార్గమియ్యదు రామ 94
కుండలీంద్రునివడిగమీదను బండియున్నది రామ
నిండుగానిర్గుణసమాధికి బండువెన్నెల రామనా॥ 95
దృక్కుదృశంబులకుమిక్కిలి యొక్కవైనది రామ
ఒక్కనిముషములోనమనసును నిక్కచేయును రామ 96
నిక్కుచుండెడిమనసువృత్తిని నుక్కజేయును రామ
ఒక్కయతురనాదమై పెంపెక్కియున్నది రామ॥ 97
ప్రతినిమేషముజపము జేసిన బరమధర్మము రామ
అతులితంబై సర్వగతమై యాడుచున్నది రామ॥ 98
వాసనత్రయములనువిడచిన వారిధనమే రామ
శ్రీసదాశివయోగపథమున శ్రీపసిద్ధియు రామనా 99
జ్ఞానశక్తికినాదిశక్తికి మానమే శ్రీరామనామము॥
జ్ఞానభూములునేడుగడచిన మానవేశం రామ॥ 100
తానువచ్చినదారిదెలిపెడి జ్ఞానమే శ్రీరామ॥
తానుబాహ్యమార్గసరణిని తగవిధించును రామ 101
జీవభావము నీశభావము జెప్పుచున్నది రామనా

జీవునికి నీశునికి నైక్యము జెందజేయును రామనా॥ 102
ఆత్మమంత్రం బాత్మయంత్రం బాత్మతంత్రం రామ
ఆత్మభోగం బాత్మయాగం బాత్మయోగం రామనా॥ 103
నిర్వికల్పసమాధియోగము నిర్విచారము రామ
సర్వమును వ్యాపించియున్నది సత్యనాగ శ్రీరా॥ 104
క్షుద్రమంత్రజాలకు నెప్పుడు క్షోభకరంబగు రామ
నిద్రజెందక తన్ను తెలిసిన ముద్రభావము రామనా 105
ఉపనిషత్సారాంశమునకు మహోత్సవము రామ
జపతపస్స్వాధ్యాయములకును జన్మభూమియు రా॥ 106
ఉపనిషద్గోప్యంబుతానై యొప్పియున్నది రామనా
కృపణులై కనుగొనని వారికి చపలచిత్తము॥ రామ॥ 107
కులముమతము లేనిబుధులకు గోర్కెదీర్చును రామ॥
సలలితంబుగ బ్రణవరవమును వెలయుచేయును రామ॥ 108

శ్రీ రామనామములు సమాప్తములు.



శ్రీరంగేశ్వర స్తవము.

శ్లో॥ ఘుష్యతేయత్రనగరే రంగయాత్రాదినేదినే।
తమహం శిరసావందే రాజానాం కులశేఖరం॥

శ్లో॥ కృష్ణత్వదీయపదపంకజరాంతం।
మద్యైవమేవిశతు మానసరాజహంసం।
ప్రాయప్రియాణసమయేకపవాత ।
పిత్తైఃకంఠావరోధనవిధౌ స్మరణంకుతస్తే॥

శ్లో॥ దివివాభువివామమాస్తువాశో ।
నరకేవానరకాంతక ప్రకాంమం ।
అవధీరతశారదారవిందౌ ।
చరణౌతేమరణే విచంతయామి॥

శ్లో॥ అమర్యాదఃక్షుద్రశ్చలమతిఃపునఃభూకృతఘ్నా।
దుర్మానేస్మరశ౦సహాశ్మరపరనంచనః।
పరఃపాపిష్టఃకథమహామిధోదుఃఖజలధేర।
పారాదుత్తీర్ణ స్తవపరిచరేయంశరణయోహాః॥

పంచచామరం.

చరాచరాత్మకప్రపంచ చాతురీదురీణుడౌ। విరించిముఖ్యన శాస్త్రజాలవేద్యుడైనతప్పనీ। నిరాజమాన సత్పదంబు వేడ జూడజాలడౌ। హరినమస్కరింతు నన్ను నాదరించికావవే॥

